శ్రీ

Reg. No. M. 2580 సంవత్సర చందా రు ౪ లు

సం॥ చందా రు ౪ లు



జమీందారీ రయితుల ఆర్థిక సాంఘిక వ్యవసాయిక భాగ్యోదయమునకు.

సంపుటము. ౨ } శనివారము ౧౨-౧౧-౩౨ నెల్లూరు } సంచిక ౬-౧౦

# జమీన్ రైతు వారము.

## ఆక్షేపణ సభలు.

ఈ క్రింది ప్రదేశములలో జమీన్ రైతువారమున ఆక్షేపణ సభలు జరిగి, ప్రభుత్వపు బిల్లును ఆక్షేపించుచు, రైతుబిల్లును ఆమోదించుచు తీర్మానముల గావించిరి.

### వెంకటగిరి ఎస్టేటులో.

(1) మోపూరు. (2) గొట్టికాడు (3) పాకపూడి (4) అలిమిలి (5) జయంపు (6) వెంబులూరు (7) సాగసపల్లె (8) వాక్కం (9) వెలంపల్లె (10) కన్నమపల్లె (11) దేవులపల్లె (12) పంటవానిపల్లె (13) చాపలపల్లె (14) నిండలి (15) వెలికల్లు (16) మార్లగుంట (17) మాధవయ్యపాళెం (18) డక్కిలి (19) కోలపోలూరు (20) చేనిగుంట (21) అండగుండాల (22) గ్రద్దగుంట (23) రామాపురం (24) వెంకట్రెడ్డిపాళెం (25) పారవోలు మొదలగు గ్రామాలు.

### పిఠాపురం యెస్టేటులో

తే 25-10-32 దిని పిఠాపురం డివిజను ఉప్పుకపల్లెగ్రామములో శ్రీ నడింపల్లి సూర్యనారాయణ రాజుగారి అధ్యక్షతక్రింద జమీందారీ రైతుల సమావేశము జరిగి అందులో ఎస్టేట్సులాండు ఆక్టుసవరణకు సంబంధించిన 6 తీర్మానములు చేయబడినవి. (తీర్మానములు ముందుసంచికలో ప్రకటింపబడును.)

### పర్లాకిమిడియెస్టేటులో

తే 31-10-32 దిని పర్లాకిమిడి రైతులసంఘమువారి యాజమాన్యమున, గురండి గ్రామములో పర్లాకిమిడి రైతుల జనరల సమావేశము జరిగినది. సంఘాధ్యక్షులగు శ్రీ మాణ్యవారి కృష్ణజన్నా మహాశయులు అధ్యక్షులుగా నియమింపబడిరి. ఇచ్ఛాపురం నుండి శ్రీయుత పుల్లెల శ్యామసుందరరావుగారు దయచేసిరి. మద్రాసు ఎస్టేట్సులాండు ఆక్టును సవరించుటకు గవర్నమెంటువారు బిల్లుపెట్టగ కారణములను అందలిలోపములను, సెలెక్టుకమిటీవారి నివేదిక ఏవిధముగా బిల్లుకున్న రైతులకు హానికరముగా వున్నదిన్ని, శ్రీయుత పుల్లెల శ్యామసుందరరావు, కన్నేపల్లి సత్యనారాయణగార్లు బోధించిరి. పిమ్మట కొన్ని తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదింపబడినవి. తమ వోట్లతో సభకువచ్చి తమహానికి జమీందార్లు ప్రయత్నించుట రైతులు చాల నిరసించిరి.

## ఓ రిట్రెంచిమెంటూ!

రవి అస్తమించని బ్రిటీషుప్రభుత్వ మునకు మోగించిన ప్రతిభ చాలదని యీ జమీందారులవద్ద చేరినావు? అచ్చోట నీకార్య క్రమమంతయు పతినేర్పుతో చలాయించితివనుకీర్తి సెట్లో నార్జింపగలిగితివిగాని, యిచ్చోట నీభాణాముసాగుటకనుమాత్రమైనను అవకాశమివ్వక, సర్వశక్తియుతుడవగు నిన్నురచేతియందు నిడుకొందురే! యిప్పటికినీవు చందనాదితాంబూలములతో నాహ్వానింపబడితివా లేక పిలువని పేరంటముగా వచ్చిచేరితివా? యెట్లయినగానిమ్ము యింతస్వల్పకాలములోనే అందరినోళ్ళలో అన్యాక్షుడవనిపించుకొంటివి. ముందున్నది ముసళ్ళపండుగ. చేయరాని పనుల నికెన్నిటినో నీవలనచేయించుటకు ప్రతినబట్టియున్నారు. యిదంతయునేను హెచ్చరించుచున్నానని నామెడనాగ్రహముబూనినను నన్నేమియు చేయజాలవు. నేనునీచెంతలేను. అయినను సర్వకాలములయందు జమీందారుల శ్రేయస్సు కోరువారలలో నేనొకడని మాత్రము మరువవద్దని కోరుటయే నాపని.

మానవసంఘమునేగాక, మానవజాతిని సంయితము పీల్చిపిప్పిజేయు దుర్వ్యసనములలో నగ్రగణ్యమయి దనరారు వేశ్యాటనమును నీవుజేరియుండు స్థానముల ప్రథమమున గమనించవలసియున్నది. అవి వాహితులుగానున్నపుడు వ్యభిచారమాచరించినతప్పులేదను శుష్కవేదాంతుల సలహాల వినియే పండ్రెండు వత్సరముల బాలికలయిన్పటికే పనికిరానిపాట్లను బడినారను కొందును. అవివెనుకటి రోజులట. యిప్పుడో డబ్బేలను సంపాదింప గలుగజేసి తమపతి గారిసంతతరాలును, భాగ్యశాలురు గు కన్యను పరిణయ మాడింపజేసినను, పుంపుసగత్తెను ఒకరాత్రి కన్నులారగా చకపోయిన, భోజనపానీయముల సైతమున దలివేసి పసిబిడ్డలమాడ్చి మేప్పనుండు వారి వద్దనేజేరితివి. మా భాగ్యమే గాని యెట్లులనీకార్యమును సాధించెదవో? అను మలుమందు నీవు పెట్టినయెడల ఆ సాని యింటిముందుండు యేనుగల ప్రక్కనీనాక యేనుగవలె నిలుచొని కావలికాయుదువేమో. జాగ్రత్త సుమా!

బహిరంపర చుద్యోగుని గాంచినంతనే నీకుగూడ భయముగలిగినట్లున్నదే! వారి బంధువర్గములోని వారెల్లరు పలుకుబడికలవారలని అధైర్యపడితివా? లేక శ్రీ ఆంజనేయస్వామివారి ఆలయమునకేగునపుడు త్రోవలో యేమైన భ్రమగలిగినదా? యివికానిచో, సర్వమేధావంతులమని తమకు తామే వుప్పొంగిపోవు రాజకోమారులవద్దనే క్షణమాత్రములో నూర్లసంఖ్య రూప్యములు మటుమాయమైపోయినవను గారడీవిద్య చేసెడువార్లవద్ద సంయితముపీ తెలివి తెల్లవారినట్లున్నదే!

తండ్రియును, కుమారుడును, మాసమునకు సుమారు పదివందలరూప్యముల వేతనముతో ఆఫీసు మేడ మెట్లుక్కుటదిగుటలోనే కాలముగడుపుచుండుట చూచుచుండియు పూరకనే యుకిలించుచున్నావు.

వ్యాయామ క్రీడా రంగమునందు భారతీయులు మహోన్నత దశనాక్రమించి, సకలప్రపంచమునందుగూడ శెభాస్ అనిపించుకొనినంతటి కీర్తివంతులయిన యీసమయమునందు యేదో అనవసరముగు అవ్యక్తులకు ప్రోత్సాహమును గలిగించు కొంటివి.

పాతకాలమునుండి పాయునపమయమువరకు ఆఫీసులలో గూలాముపని జేసినగాని ఆడజను రూప్యములు మాసమునకు లభింపని యేరుగుదనో లేక డ్రైవరీనో గుమాస్తాల నోటమట్టివేసి నందునే నీవు ఘనకార్య మొనర్చినావని యిచ్చట యెవ్వరును పొగడుటలేదు.

భోజనపానీయములందు గూడ ప్రవేశించితివటనే! పోనీ, నీమహోపకారము వలనవయినను మాదాసులు ఉచ్ఛిష్టాన్న భక్షణము కొంతవరకీరతిన మటుమాయమై పోవగలదు.

తెంజనగరమున జరిగిన బ్రాహ్మణేతర మహాజనసభకేగిన డెలిగేట్లకు Family tickets గూడలభించిన సంగతేమైన యెరుగుదువా? Family tickets అంటే ఒకేయింటిలో యెంతమంది పురుషులుంటే అందరికిని మహాజన పట్టాము గట్టించుట. తెంజనగరములో చేతులెత్తించుట.

యింతకుతు నివారించు అకృత్యములు నీవు తెలిసికొనకయే చేయుచున్నావని యింతగా విన్నవించుకొంటిని. యిప్పటికైనను నీవైఖరిని మార్చుకొని కడుజాగ్రత్తగా మెలంగు ఆలోచనాశక్తి, వివేకము, నేర్పు, దయామయుడు అతిశీఘ్రకాలములోనే నీకు ప్రసాదించుగాక.

మల్లిశెట్టి వెంకటకృష్ణయ్య.

## కాళహస్తి సత్రము.

కాళహస్తి క్షేత్రమునకు యాత్రవచ్చు బ్రాహ్మణులకు పేరులు శ్రీపువ్వగిరి స్వాములవారి సత్రమునందున. రాత్రి మునకివారి [illegible] భోజన వసతులను. [illegible] పాత్రసామానువసతిచేయుచున్నను. [illegible] సత్రములో [illegible] [illegible] మాకు [illegible] అనుమతిపొందవలెను. రాత్రిభోజనమునకు [illegible] 7 ఘంటలలోగా తెలిపి తమకేమి [illegible].

కొండపి సుబ్బరావు,

మేనేజరు ఆఫ్ మెయిలు.

# తూర్పు గోదావరిజిల్లాలో తాలూకా, జిల్లాబోర్డు ఎన్నికలు.

—(౦)—

జమీందార్ల భగీరథప్రయత్నములు

---

పిఠాపురములో మహారాజావారి విందు

---

తూర్పు గోదావరిజిల్లాలో తాలూకాబోర్డు, జిల్లాబోర్డులకు పూర్తిగాయెన్నికలు జరిగినవి. జిల్లాబోర్డు మూడుస్థానములకు నేడు దరఖాస్తులు దాఖలుచేయబడినవి. ఎన్నికలు నవంబరు 22-వ తేదిన జరుగును. కాని ఒకసంగతి మరువజనదు. గతనెల 16-వ తేది ఆదివారము సాయంకాలము పిఠాపురము ఉన్నతపాఠశాలలో జరిగినవిందు సందర్భమున పిఠాపురము మహారాజావారిచ్చిన ఉపన్యాసము కొంచెము విమర్శింపవలసియున్నది. నూతనముగా ఎన్నుకొనబడిన తాలూకా, జిల్లాబోర్డుసభ్యులకు విందుజరిపిరి. మహారాజావారి ఉద్యోగులు, కవులు, అశ్రితులు రైతులు మొత్తము యిన్నూరుమందివచ్చిరి. ఆసమయమున మహారాజావారు ప్రసంగించుచు, తాలూకాబోర్డు, జిల్లాబోర్డు ఎన్నికలవిషయములో తానేమియు స్వయముగాకలుగజేసికొనలేదనియు, ప్రజలే తమయిష్టమువచ్చినవారిని ఎన్నుకొనిరనియు, ఆరోజు విందుకుతమ్మును, వారికొమారు లిరువురిని, అల్లుళ్ళనిద్దరిని ఆహ్వానించి, గౌరవించినందులకున్ను, ప్రజలందఱు తమయందు భక్తికలవారై యున్నందులకు, తమకుటుంబమువారు కృతజ్ఞులమని తెలవిచ్చిరి. అంత్యమున ముగించుచు "మీమేలే, నామేలు, మీక్షేమమే నాక్షేమము" అనిముగించిరి.

ఇందంతయు బాగుగనేయున్నది. కానిగత ఎన్నికలలో పిఠాపురం మహారాజావారి దివాను కోటా వెంకటసుబ్బారావునాయుడు, కానేదారు పిళ్ళారిశెట్టి రంగబ్రహ్మరావునాయుడు, రాజాగారి బావమరిది దామెర సీతారామస్వామిగార్లు ఎస్టేటు పక్షమునచేసిన ప్రచారముచూచిన, వినిన, మహారాజావారి మాటలు బూటకములగును. రయితుపక్షమువారిని పూర్తిగా ఓడగొట్టి తాలూకాబోర్డు పన్నెండు స్థానములు జిల్లాబోర్డు నాలుగుస్థానములు ఎస్టేటువారే ఆక్రమించుకొనిరి. ఎన్నికలలో ఓట్లను ఎస్టేటు పార్టీవారికివ్వనియెడల, మహారాజావారు రయితులకు పంటకు నీరుయివ్వమనియు, బకాయివున్న శిస్తులు తక్షణమేజప్తుచేసి వసూలుచేయుదుమనియు, గ్రామములో రయితులకు ముజారాయిచ్చుపద్ధతి మానుదుమనియు, యింకా యితరవిధముల బె ద రి ం చి రి. దీనికి రయితులేసాక్ష్యమిచ్చుచున్నారు. మరియు ఒకరియిద్దరు పెత్తనదార్లకు ముజారానిలిపివేసిరి. పిఠాపురపు ఫిర్కానుండి తాలూకాబోర్డుకు జిల్లాబోర్డుకు అభ్యర్థిగ రైతుపక్షమునుండి పిఠాపురము రాజావారి గ్రామమునసబుం రాజావారి బావమరిదికి రాజావారి కానేదారుకు ఎన్నికలకు నిలచినారు. అగ్రాసను మునసబు చక్రవర్తుల పద్మరాజు, పిఠాపురము యూనియనుబోర్డు అధ్యక్షులుగా ఎన్నుకొనబడియున్నారు. ఎన్నికలలో యితనిని ఓడకొట్టుటయేగాక ఎన్నికల సమయమందే యూనియనుబోర్డు అధ్యక్షునిమీద విశ్వాస రాహిత్యతీర్మానము పెట్టించిరి.

ఇందు కొంతమంది సభ్యులకు విశ్వాస రాహిత్య తీర్మానము పెట్టుటకు మనస్సాక్షికి వ్యతిరేకముయినను మహారాజావారు సామదానములు రెండున్ను ఉపయోగించి, పూర్తిగా సభ్యులచేత అంగీకరింపచేసి వారి ఆశ్రితుడు సముద్రాల భాష్యకాచార్యులు గారి నెన్నుకొనిరి. విరవాడ ఫిర్కానుండి తాలూకాబోర్డుకు చలికాని వెంకట ధర్మారావుగారికి కుమ్మరి సాంబయ్యకు జరిగిన పోటీలో రాజావారి బావమరది, కానేదారు, దివాను స్వయముగ వారిగ్రామములో వుండి, పిఠాపురం రాజావారి గ్రామములోనికి ధర్మరావుగారిని ఎందుకు అడుగు పెట్టనిచ్చినారని, యీ గ్రామము "మీ తాతగారిదాయని ధర్మరావుగారిని మీ రెందు కడుగలేదనియు" యీవూరికివచ్చిన గట్టిగా బుద్ధిచెప్పుదని ప్రజలను హెచ్చరించిరి. పోలింగునరోజు ధర్మరావు గారికి ఓట్లుయిచ్చువారు పోలింగుకురాగా, వారిపైని యిదివరకే డిక్రీలైయున్న వారంట్లను ఆరోజు అములు జరిపించి పోలింగుస్టేషనువద్ద యిద్దరు ఓటర్లను అరస్టుచేయించి మరుసటి దినము జామీనుమీద వదలివేయబడిరి. ధర్మారావుగారు ఆరు ఓట్లతో ఓడిపోయిరి. మరుసటిదినమే ధర్మారావుగారి మీద ఋణదాతలు ముగ్గురిచేత 17 వేల రూపాయలకు దావాలు చేయించిరి.

ఈ కథయంతయు చూచిన, మహారాజావారికి ఎన్నికలలో ఏట్టిసంబంధమున్నదియు లేనిదియు తెలియుచున్నది. ఈ భగీరథ ప్రయత్నములన్నియు చూచిన జిల్లాబోర్డు అధ్యక్ష పదవి ప్రజాపక్షము వారికి సంక్రమింపకుండ చేయుటకును, జస్టిసు పార్టీ, జమీందారుల పార్టీ రెండు కలసి ప్రజాపక్షమును పూర్తిగా ఓడగొట్టుటకు రాజీలు జరుగుచున్నవి. ఈ ఫలితమును బట్టి, రాబోవుశాసన సభా ఎన్నికలను తూర్పుగోదావరి జిల్లానుండి ఆరు స్థానములుండు ననియు, ఇంగ్లండులోవలె కౌంటీ (County) ఎన్నికలుండుననియు, ఆ ఆరు స్థానములు జమీందారీ పక్షమువారే ఆక్రమించుకొనవలెననియు, పన్నుగడలు పన్నుచున్నట్లు తెలియుచున్నది. భావి ఎట్లు పరిణమించునో చూడవలయు

# శ్రీకాళహస్తి.

రయితుల, అమాయకత్వము.

సుప్రసిద్ధ రయితుసోదర సోదరీమణులారా!

ప్రముఖులారా!

చిత్తూరు జిల్లాబోర్డు తాలూకాబోర్డుల ఎలక్షను 15-11-32 వ తారీఖున జరుగనున్నది. అభ్యర్థులలో నధిక సంఖ్యాకులు రయితులుగా యుండియు క్రింద వివరించియుండు కారణములవల్ల అభ్యర్థుల పదవులు జమీందారులకేయగునటుల తోచుచున్నది.

1. జమీందారుల మేలు భవనములందు రయితులకు జరుగు విందులు. సమాన గౌరవము లిచ్చుట.
2. రెడ్లు నాయుడుగార్లు. ఈ జమీందారీ గ్రామములందు. మణియములుగాను. ఆ మల్‌దార్లుగా నుండుట.
3. బీదరికము వల్లను. లేక శిస్తు మొదలగు ఋణములువల్లను వార్ల నాశ్రయించుట.

మరియు జమీందారీ రయితు, కృషీవలుడు, మొదలగు వార్తాపత్రికలుండియు వాటి యుద్దేశము శ్రీ కాళహస్తి ప్రాంత్యముల ఫలించునట్లుగా తోచుటలేదు. ప్రస్తుత రాష్ట్ర ప్రభుత్వ పాలనమందు జరుగుచుండు. యస్టేట్ ల్యాండ్ ఆక్టు సవరణ బిల్లు మొదలు భవిష్యత్తు రానున్న శాసనము లందాధారమును కలిగించుకొన నెంచు జమీందార్ల యొక్కయు, రైతులయొక్కయు, పోరాటమును వివరించు పటము రంజాన్పూర్ సభా ఫొన్నరెను గమనించక యున్ను, భవిష్యత్తు నూహించకయే, మా రైతు సోదరులు జమీందార్లయొక్క తాత్కాలిక మాయలకు లోనుగాకుందురుగాక. భవిష్యత్తునూహించి మనము స్థానిక సంస్థలకున్ను శాసనసభలకున్ను. జమీందారులగాని, వారి పక్షీయులుగాని, సమ్మతుల (ఓట్లు) నిచ్చి పంపకూడదను సంగతిని మన మెందరోవలకు వచ్చుకెవ్వకొని సుప్రసిద్ధ రైతుపక్ష ప్రముఖులను గమనించి సమ్మతులనివ్వ ప్రార్థించుచున్నాను. మరియు రైతుపక్ష నిష్కలంక ప్రముఖులెవరైనను ఈప్రాంతమున పర్యటనముగావించి జమీందారుల వలలో నిద్రించు మా రైతుప్రముఖులను మేల్కొల్పుదురుగాక. రైతుపక్షమునకు జై

(ఒక విలేఖరి.)

# పత్రిక దీనావస్థ.

2-3-30తేదినుండి మధ్య మధ్య గలుగు అంతరాయములు తప్పించుకొని జమీందారీరైతు పత్రిక నెల్లో దినగండములతో నడుపుచున్నాము. లక్షలాది జమీందారీ రైతులు గలిగియు ఒక్క పత్రికను పోషింపలేకపోవుట విచారకరము. జమీందారుల యొకమాటును రైతుబాధలప్రకటించుటకు యితరపత్రికలు వెనుదీయుచున్నపుడు రైతులైనను నిష్పక్షమునగా తమకష్టముల ప్రకటించుకొనుటకు పత్రికఅవసరముకదా! జమీందారులు లక్షలాదిధనమునుధారబోసి పత్రికలను, పార్టీని నడుపుకొనుచున్నారు. బొబ్బిలివారుమాత్రమే జస్టీసుపార్టీపత్రికలకును, పార్టీనడుపుటకును లక్షల వరకు పెట్టిరట. మనస్థితియన్న మేది? ఆంధ్రదేశము మొత్తముమీద ఒకవారపత్రికనుపోషింపలేకున్నాము. వేలు, లక్షలివ్వలేకపోయినను సం॥ చందా రు 4—0—0 లు ఇచ్చుటకు సమయము చేతు లాడుటలేదు. సంవత్సరములాది పత్రికలుపంపినను చందా అడిగినంతనే కళ్ళనీళ్ళు గార్చువారెందరో గలరు. జమీందారుజవానుకు ఒకదఫా యిచ్చినలంచమంత లేదు మొత్తము. సోదరులా! కష్టములో కష్టమనుకొని పత్రికను పోషింపకున్న ఎట్లు? ఇప్పటివరకెందరో ఉదారమహాశయులు వందలాది గుప్తదానముల నిచ్చి పత్రికను పోషించుచున్నారు. ఎంతకాలమిట్లు జరుగగలదు? శనివారమువచ్చినంతనే పోస్టుస్టాంపులకు డబ్బుసంపాదింపలేక కళ్ళనీళ్ళపడిపోవుచున్నవి. యెన్ని వుత్తరములు వ్రాసినను జవాబుండదు. వి. పి. లు పంపిన అన్నితిరుగావచ్చును. ప్రతిగ్రామమువెళ్ళి వీకెంట్లు తిరుగుట కెట్లుసాధ్యము. అప్పటికి కొన్నిచోట్ల ఏజెంట్లను నియమించితిమి. వారుప్రతిపూట కడప కడప తిరిగినను వారికీకములు వసూలగుటలేదు. జమీన్ రయితు సోదరులారా! ఇంకనయినను మా కష్టములగమనించి తమరి చందా ధనమును వెంటనేమనియార్డరు ద్వారాపంపియు, ఇతరులప్రోత్సాహించియు, పత్రికను పోషింపవలెనని ప్రార్థించుచున్నాము.

పత్రికనిర్వాహకులు.

# సమకాలికాభిప్రాయము.

ఆంధ్రపత్రిక నవంబరు 2తేది సంపాదకీయము.

మద్రాసు ఎస్టేట్సులాండు సవరణచట్టము.

సి. సత్యనారాయణ చౌదరిగారి మద్రాసు ఎస్టేట్సులాండు సవరణచట్టము మొన్నటిదినము శాసనసభలో ప్రవేశపెట్టబడినది. ప్రభుత్వచట్ట మిదివరకే ప్రవేశపెట్టబడి సెలెక్టుకమిటీ రిపోర్టుగూడ వెలువడెను. ఇయ్యది రైతుల యామోదము బడయలేదని స్పష్టమయ్యెను. సత్యనారాయణచౌదరిగారి చట్టముగూడ సెలెక్టుకమిటీకంపబడి, వారిరిపోర్టు వెలువడువరకు ప్రభుత్వచట్టవిచారణను నిలిపియుంచుట కనీస ధర్మముగును. రెండుచట్టములను మదరాసు శాసనసభవారొక్కపర్యాయమే చర్చించుటకు ప్రభుత్వమువారు అవకాశమీయని యెడల, జమీందారీరైతులకు తీరనిఅన్యాయము గలిగి రైతులకును జమీందారులకును మధ్య మనస్పర్థలు బలమగుట తప్ప వేరు లాభము గలుగదు.

# వెంకటగిరి రైతులకు విన్నపము.

రైతు సోదరులారా!

1342 ఫసలీకి కంచెలను రైతులు వెంటనే తీసుకొనవలెనని కోరుచున్నాము. పైకము వెంటనే చెల్లించుటకు వసతిలేని గ్రామస్తులు ప్రోనోట్లను అయినను వ్రాసి యిచ్చి కంచెలను తీసుకొన ప్రార్థించుచున్నాము. మేముకూడా అటే చేయుచున్నాము.

ఇట్లు,

(Sd) అల్లం పిచ్చిరెడ్డి, (మాధవయ్యపాలెం.)
,, కాసరం చెంచురెడ్డి, (మోపూరు.)
,, జూపల్లి రామకృష్ణరావు, (అల్తూరుపాడు.)
,, వెల్లూరు గోవిందరెడ్డి, (తిక్కంపాడు.)
,, మాదమాల వేమారెడ్డి, (దేవులపల్లి.)
,, కోలా నరసప్పనాయుడు, (వెంటలూరు.)

9—11—1932.

# రైతుల బిల్లు.



31—10—32 తేది శాసనసభలో చలసాని సత్యనారాయణ చౌదరిగారిచే ప్రవేశపెట్టబడిన ఎస్టేట్సు ల్యాండు అక్టుసవరణ బిల్లులో-

(1) సుక్తి, బంజరు, ముజరాలు (రిమిషన్)

(2) నీటివసతుల రివేరునుగూర్చి ముఖ్యమార్పు.

(3) కంచెలలో కేవుడాలు (అగ్రిమెంట్సు)

ఈ వగైరా ముఖ్యమార్పులు గలవు.

గాన ఈబిల్లును శాసనసభలో గెలిపించుకొనుటకు జమీందారీ రైతులు కృషిసలుపవలెను.

మునుస్వామి నాయుడుగారును మరికొందరును నీహక్కులకై పోరాడుటకు సిద్ధముగా నున్నారు.

నీవేమి నిద్రపోవుచున్నావు?

## రాగల యుగమున నీకృషియేమి?

నీవును హక్కును వ్యర్థపరచక, నీకై నిరంతరమును పోరాడు, రైతుప్రతినిధికే ఓటునిచ్చి గెలిపించవలెను.

## అందుకు నేడేమి చేయవలెను?

తాలూకాబోర్డు, జిల్లాబోర్డులకు నీప్రతినిధుల నెన్నుకొని జమీందారు పార్టీవారిని ఓడగొట్టినచో, వీరేరేపు శాసనసభకు జమీందార్ల నోడగొట్టుదురు.

అట్లుచేయకపోతివా! నీవేగాక నీవారిని సైతము అధోగతికి త్రోసిన వాడవగుదువు.

జమీందారీ రైతుబిడ్డా! జాగ్రత్త!!

కందుకూరు, కావలి, బోర్డుల నామినేషనుల తేదులుమాత్రము మారినవి. తక్కినవి మార్పులేదు

సంపాదకుడు, ముద్రాపకుడు, నెల్లూరు, వెంకటాద్రిమానాయుడు, జమీందారీరైతు ముద్రణాలయం, గాంధిపేట్, నెల్లూరు.